౩౨½ గర్గమహర్షి రాజుతో నిట్లనెను. ఓ రాజా! నేనయోధ్యాపురికేగి నీవు చెప్పినవిధముగ నే కైకేయీదశరథులకు వివాహము నేర్పరచెదను.

౩౩½ ఈవిధముగ గర్గమహర్షి, రాజుతోఁ జెప్పి రాజానుజ్ఞను బడసి సాకేతపురికేగి దశరథుని సందర్శింపఁగా, దశరథుఁడు గర్గమహర్షిని బూజించి యిట్లుఁ బల్కెను.

౩౪½ ఓ గర్గమహర్షి! నీరాకచే నాజన్మము సఫలమయ్యెను. మీవంటి మహాత్ములరు పనిలేకపోయినను లోకమును బవిత్రముఁ జేయుటకై భూమియందు సంచరించుచుందురు అని దశరథుడు పలికెను.

౩౫½ అప్పుడు గర్గమహర్షి యిట్లనియెను. ఓ దశరథమహారాజా! నీకీర్తిచే నా శ్రోత్రములు పూరితములైయున్నవి. నేత్రములకుఁగూడ సాఫల్యము కలుగఁజేయుటకొఱకు నీసమీపమునకు వచ్చితిని.

౩౬½ మఱియు, ఓ రాజా! నేనొక కోరికతో దూరదేశమునుండి నీదగ్గఱకు వచ్చితిని. దాతలలో శ్రేష్ఠుఁడవగు దశరథా! నా కోరికను సఫలము జేయుము (అని గర్గమహర్షి చెప్పెను.)

౩౭ గర్గమహర్షితో దశరథుఁడిట్లు చెప్పెను. నాయొక్క యాగములచేతను బ్రాణములచేతనైనను నీవు కోరినకార్యమును నెరవేర్చెదనని చెప్పెను.

౩౮ గర్గమహర్షి రాజుతో నిట్లనెను. ఓ రాజా! కాశ్మీరదేశప్రభువగు కేకయరాజు తన పుత్రికయగు కైకేయిని ప్రతిజ్ఞాపూర్వకముగ నీకు నీయఁగలఁడు.

౩౯½ ఓ రాజా! ఆప్రతిజ్ఞను జెప్పెదను. కైకేయియందు నీకు గలిగిన కొమరునకు రాజ్యము నిచ్చెదనని ప్రతిజ్ఞఁజేసి యీ కన్యను గ్రహింపుమని యతని ప్రతిజ్ఞయైయున్నది.

౪౦ ఓ రాజా! ఈ ప్రతిజ్ఞ నంగీకరించితివేని నామెను వివాహము జేసికొనుమని గర్గమహర్షి చెప్పెను.

రాజాస్వాగతం॥శ్లో॥ వివాహస్తు మమాభీష్టః వప్తృతే రాజ్యమర్ప
ణం। యదిచేన్మమ పుత్రాశ్చ భవిష్యంతి హ్యపుత్రిణః॥ ౪౧॥

తేచాపి స్వస్య వంశస్య మర్యాదాం చ కుమారకాః ।
న త్యజంతి మహాత్మానః స్త్వాదావిక్ష్వాకునాకృతాం॥ ౪౨॥

ఇతి నిశ్చిత్య రాజా చ । వసిష్ఠాదభి రాత్మవాన్
పురంధ్రీభి స్సమాలోచ్య తాభిశ్చ ప్రేరితో౽వదత్ ॥౪౩॥

యథా వదసి భో విప్ర తథైవ కరవాణ్యహం
ఇత్యుక్త్వాఽనుమతి స్సర్వైః । కాశ్మీరం ప్రతి పర్యయౌ। ౪౪॥

కాశ్మీరదేశపాలేన పూజితః పరమాదరైః
చకార గ్రహణం పాణేః।కైకేయ్యా రాజపుంగవః॥ ౪౫॥

కాశ్మీరస్య పతిః ప్రీతః పారిబర్హం దదౌ ముదా
మంథరామపి దాసీం చ । కైకేయ్యాః ప్రీతికారిణీం॥౪౬॥

రేమే రాజా తయా సార్ధం సంవత్సరగణాన్బహూన్
పాలయా చ యథా దేవస్త్వయోధ్యాయాం
తథా నృపః॥ ౪౭॥

తస్మిన్కాలే దేవతానాం దానవానాం చ సంగరః
అభవత్సంగరే తస్మిన్ శంబరేణ జితాస్సు [illegible]॥ ౪౮॥

తదా భవద్దేవవాణీ యుద్ధాయాయోధ్యాపతిర్మహాన్
జయస్తత్ర నసందేహః స[illegible]నయిత త[illegible]॥ ౪౯॥

---

1 సత్యోపాఖ్యానే రామాయణే.

౭౧౪-౭౨౪ దశరథుఁడు తనలో నిట్లూహించెను కైకేయివివాహమాడుట నాకు సమ్మతమే కాని యామెకుఁగలిగిన పుత్త్రునకు రాజ్యము నిచ్చుటకు శపథము చేయుట యనునది సమ్మతముగా లేదు. కాని సంతానమే లేని నాకుఁ బుత్త్రులు కలిగినచో నాకుమారులును దమ వంశమర్యాదను నతిక్రమింపరు.

౭౩౪ ఇవ్విధముగ దశరథుఁడు నిశ్చయించి వసిష్ఠాదులతోడను దనభార్యలతోడను నాలోచించి వారిచేఁ బ్రోత్సహింపఁబడి గర్గమహర్షి ని గూర్చి యిట్లు బలికెను.

౭౪౪ ఓ మహర్షీ! నీవు చెప్పిన ప్రకారముగాఁ గైకేయిని వివాహమాడెద నని చెప్పి దశరథుఁడు వెంటనే తనపరివారముతోఁ గేకయరాజ పట్టణమున కేగెను.

౭౫౪ కేకయరాజుచేఁ బూజింపఁబడి దశరథుఁడు కైకేయిని యథావిధిగా వివాహముఁ జేసికొనెను.

౭౬౪ ఆసమయమున కేకయరాజు దశరథునకుఁ బారితోషికముల నేకములు నిచ్చెను మఱియు కేకయరాజు తనపుత్త్రికకుఁ బ్రేమాస్పదమైన మంథరయను దాసినిగూడ నిచ్చెను.

౭౭౪ దశరథుఁడు కైకేయితోఁగూడ, శచీదేవితో దేవేంద్రుఁడువలె నయోధ్యాపట్టణమున బహుసంవత్సరములు సుఖించెను.

౭౮ ఆకాలమున దేవదానవులకు యుద్ధము జరిగెను. ఆయుద్ధమునదు శంబరుడను రాక్షసునిచే దేవతలు జయింపఁబడిరి.

౭౯౪ అప్పుడు దైవవాణి యిట్లు వినఁబడెను. ఓ దేవతలారా? అయోధ్యాపట్టణమునకుఁ బ్రభువగు దశరథుఁడే పక్షమున నుండునో, యాపక్షమున జయముగలుగుటకు సందియము లేదు కావున నతనిని తీసికొని రండు. అని యాకాశవాణి వినఁబడెను.

1 శ్రుత్వాగిరం సుమనస స్సాకేతాధిపతిం నృపం
ఆనేతుంచ జగత్ప్రాణం ప్రేషయామాను రక్షతాం॥ ౧౦౪

సమీరణ ప్రార్థనయా తదా దశరథో నృపః
కైకేయీసహిత స్స్వర్ణం రథారూఢో వినిర్యయౌ॥ ౧౦౫

తత్ర గత్వా దశరథ శ్చకార కదనం మహత్
శంబరోపి మహామాయా స్సంగరేతు ప్రయుక్తవాన్॥ ౧౦౬

వ్యాఘ్రరూపీ సింహరూపీ వ్యాళరూపస్తథ శంబరః
నానాభీకరరూప స్స నృపోపరి సమాయయౌ। ౧౦౭

వారయామాస మాయా స్తాః ధవళాంగ మహామనా
ఉపరిష్టా న్మహాబలా త్కైకేయీ సంగరే తదా॥ ౧౦౮

ఏతస్మిన్నంతరే రాజా భిన్నాక్షం స్వాంగం పునః
సంగ్రామ సంభ్రమా త్తత్ర నావిద ద్రణకౌతుకీ॥ ౧౦౯

1. ఆనంద రామాయణే.

౫౦। ఆకాశవాణిని దేవతలు విని, యయోధ్యాపురీశుడగు దశరథునిఁ దీసికొనివచ్చుటకు వాయుదేవునిఁ బంపిరి.

౫౧। వాయుదేవుడు సాకేతపురికేగి దశరథుని రాక్షసులతో యుద్ధము చేయుటకు రమ్మని కోరగా, నా వాయుదేవుని ప్రార్థనచే దశరథుడు కైకేయీ సహితముగ రథారూఢుడై బయలుదేరెను. కైకేయి తన భర్తయైన దశరథుడు రాక్షసులతో యుద్ధమునకు వెళ్ళుచుండుటచే రాక్షసులవలన నేమిప్రమాదము వచ్చునోయని రాక్షసమాయలను దెలిసిన తానుగూడ బయలుదేరెనని యూహింపదగు)

౫౨। దశరథుడు శంబరాసురుని పట్టణమునకేగి రాక్షసులతో గొప్ప యుద్ధమును జేసెను. ఆ యుద్ధమునందు శంబరాసురుడును తన రాక్షసమాయలను దశరథునిమీదఁ బ్రయోగించెను.

౫౩। మఱియు శంబరాసురుడు వ్యాఘ్రరూపముతోడను, సింహరూపముతోను, సర్పాకారముతోను, మఱియు నితరములగు భయంకరరూపములతోను దశరథునిమీదికి వచ్చుచుండెను.

౫౪। దశరథునిసమీపమునందున్న కైకేయి, బాల్యమునఁ దండ్రిగృహమునందున్నప్పుడు ధవళాంగమహర్షి పరిచర్య చేసినందున నమ్మహర్షి సంతసించి కైకేయికి రాక్షసమాయలకుఁ బ్రతిక్రియల నుపదేశించెను. ఆ ధవళాంగమహర్షిచే నుపదేశింపబడిన మంత్రబలముచేతను యుద్ధములో శంబరాసురుఁడు దశరథునిమీదఁ బ్రయోగించిన మాయలనన్నిటిని నివారించెను.

౫౫। ఈ సమయమునందు దశరథుని రథచక్రముయొక్క శీల విఱిగిపోయెను. ఆసంగతి గుర్తెఱుంగక దశరథుడు యుద్ధమునందలి వేడుకతో తొందరలోనుండెను.

* రాజ్ఞోఽంతికే స్థితాసుభ్రూః కైకేయీ స్వరథం పునః
భిన్నాక్షంతు దశరథ్యాథ వామహస్తం నిజం పునః
అక్షస్థానే చకారాఽసు స్వపతే ర్జయహేతవే॥ ౫౬-౫౭

---

* నన్వక్షస్థానే కైకేయ్యాః హస్తనిక్షేపణే కథం తన్నభగ్న మితిచే దత్రోచ్యతే, కదాచి త్కేకయగృహం ధవళాంగముని రాగతః కేకయశ్చ నియుక్తవాన్ కైకేయీం తత్సేవార్థం. కైకేయీ చాపి బహుధా తస్య పరిచర్యాం చకార॥ శ్లో॥ గంతుకామం మునిం దృష్ట్వా వరం వవ్రేథ కైకయీ। తా మువాచ మునిస్త్వాం తు చక్రవర్తీ పరిష్యతి। తవ వామకరం వజ్రతుల్యం భవతి ధ్రువం। యుక్త స్త్వం వామహస్తేనాఽకరో ర్మయి నమస్కృతిం॥ ఇత్యుక్త్వా రక్షసాం మాయానాశినీశ్చ ప్రతిక్రియాః। ఉపదిశ్య చ కైకేయ్యై గతవాన్ధవళాంగక ఇతి ఆనంద రామాయణాది వచన ప్రామాణ్యాత్ కైకేయ్యాః శాంబరీమాయానివారణ శక్తిః వజ్రాధిక కాఠిన్య వామకరప్రక్షేపణశక్తిశ్చ సంజాతేతి సుస్థం.

---

1 అథ జిత్వా రణే దైత్యా న్దృష్ట్వా తత్కర్మ పార్థివః
దదౌ వరౌ ద్వౌ కైకేయ్యై [illegible] స్వీకృతౌ నృపే
యదాహం యాచయిష్యామి త[illegible] త్వాం దేహి తావితీ॥ ౫౮

---

1 ఆ॥ రా॥

*౫౬-౫౭ దశరథుని సమీపమునందున్న కైకేయి, తన రథచక్రముయొక్క శీల విఱిగినట్లు తెలిసికొని దశరథునకు ప్రమాదము లేకుండునట్లు తన వామహస్తమును చక్రముయొక్క శీలమేకకు బదులుగా నుంచి రథము పడకుండునట్లుచేసి దశరథునిఁ గాపాడెను.

---

* ౫౭. రథచక్రముయొక్క సీలమేకుకు బదులుగ కైకేయి తన వామహస్తము నుంచెనుకదా యెట్లు కైకేయియొక్క వామహస్తము విఱుగలేదని సందేహముండవచ్చును. ఈ విషయమున ఆనందరామాయణాది గ్రంథములయం దిట్లు చెప్పబడినది-కైకేయి బాలికగా నున్నసమయమున నొకప్పుడు కేకయరాజగృహమునకు ధవళాంగుడను మహర్షి రాగా నమ్మహర్షికి బరిచర్యచేయుటకు కేకయరాజు, తన పుత్రికయగు కైకేయిని నియమింపగా, నామె పరిచర్య బాగుగఁ జేసెను. పిదప ధవళాంగమహర్షి వెళ్ళుచుండగా కైకేయి, మహర్షిని వరమును గోరెను. అప్పుడు ధవళాంగుడు సంతసించి నీకు చక్రవర్తియగు భర్త రాగలడని వరమిచ్చి మఱియు నిట్లుఁ జెప్పెను. నీవు నాకు ఎడమచేతితో నమస్కారము చేసినందున నీ వామహస్తము వజ్రముకంటెను గట్టిదగునుగాకయని చెప్పి రాక్షసమాయల ప్రతిక్రియలను తత్సంబంధమైన మంత్రముల నుపదేశించి ధవళాంగుడు వెళ్ళిపోయెను. ఇట్టి యానందరామాయణాది వచనములను బట్టి కైకేయికి శంబర మాయానివారణశక్తియు వజ్రముకంటె కఠినమైన వామహస్తమును సీలమేకకు బదులుగా నుపయోగించు శక్తియు, కలిగెనని యూహింపవలయును.

---

౫౮-౬౪ అనంతరము యుద్ధములో దశరథుడు రాక్షసులను జయించు, కైకేయి తనరథము పడకుండగ తన వామహస్తమును సీలమేకకు బదులుగా బెట్టియు, శంబరమాయలను నివారించియు, రెండువిధములఁ దన కుపకారము చేసినందున రెండువరములను కైకేయిని గోరుకొనుమన, నామె నేను కోరినప్పుడు రెండువరముల నిమ్మని చెప్పి దశరథునియొద్దనే దాచియుంచెను.

తతః పరం దశరథ శ్శంబరం హంతు ముద్యతః
నివారయామాస నృపం నారద స్తత్ర చాగతః॥ ౫౯

ద్వాపరే శంబరం భూప ప్రద్యుమ్నో నిహనిష్యతి
ఇత్యుక్త్వా థ గత స్స్వర్గం నారదో రామనామకృత్॥ ౬౦

అథాఽజపుత్ర స్స్వపురీం ప్రతి సంప్రేష్య కైకయీం
దేవేంద్రేణ సమాహూతః స్స్వర్గలోక ముపాగతః॥ ౬౧

తత్రోపవేశ్య దేవేంద్ర స్స్వార్ధ సింహాసనే నృపం
సన్మానయామాస తదా సుధర్మాయాం విశేషతః॥ ౬౨

అథాగత్య పురీం స్వీయాం। రాజా దశరథోఽనఘః
వసిత్వా స్వగృహే సర్వసౌఖ్యా న్యనుభవన్ స్థితః॥ ౬౩

అథ దశరథో దశరథసమానరథీ మహీయసా బలేనసుమ
నసం నామ నగరం జగమిషయా పంకేరుహానుతసుతం
వసిష్ఠ మాహూయ నమస్కృత్య మునిదత్తానుజ్ఞః శతా
క్షౌహిణీ సేనయాసహాఽరుహ్య తురగముఖ్యం చంద్రస
మానశరీర మతిరోషసమాకృష్ట కిష్టగ్రశవస మారాధ్య
దండయాత్రాంచకార సాధ్యోనామ స్వీయయా సేనయా
వృతో దశరథాభిముఖ మాయయౌ యోద్ధుం యుద్ధం
చానయో స్స మభూత్

మాస మేకం యుద్ధం కృత్వా దశరథ స్సం సాధ్యం
జగ్రాహ, అథ సాధ్యమానసం భువో భూషణ మవ

౫౯౪ దశరథుఁడు పిమ్మట శంబరుని సంహరించుటకుఁ బ్రయత్నించు చుండఁగా, నా సమయమున నారదుఁడచటికి వచ్చి దశరథుని నివారించి యిట్లుఁ బలికెను.

౬౦౪ ఓ దశరథా! ద్వాపరయుగమునందు శంబరాసురునిఁ బ్రద్యుమ్నుఁడు సంహరించును. కాన నీవిపుడుపేక్షింపుమని చెప్పి నారదుఁడు రామనామమునుఁ జెసికొనుచు స్వర్గలోకమున కేగెను.

౬౧౪ అనంతరము, దశరథుడు కైకేయిని తన పట్టణమునకుఁబంపి తన్ను దేవేంద్రుఁడాహ్వానించినందున స్వర్గములోకమున కేగెను.

౬౨౪ దేవేంద్రుడు దేవసభలో దశరథుని తనయొక్క సింహాసనమునందుఁ గూర్చుండఁబెట్టి విశేషముగ గౌరవించెను.

౬౩౪ అనంతరము దశరథుడు తన పురమునకువచ్చి స్వగృహమునందుండి సర్వసౌఖ్యముల ననుభవించుచుండెను.

౬౪౪ అనంతరము దశరథికలలో సమానరథికుడైన దశరథమహారాజు గొప్ప సైన్యముతో సుమనసమను పట్టణముమీదికి యుద్ధమునకుఁ బోదలచి బ్రహ్మపుత్త్రుడగు వసిష్ఠునకు నమస్కరించితదనుమతిఁబడసి కులదైవమగు రంగనాయకుని నారాధించి చంద్రవర్ణముగల యొక యశ్వము నెక్కి శతాక్షౌహిణీసైన్యముతో సుమనసనగరముమీదికి దండయాత్ర వెడలెను. సుమనసనగరాధీశుడగు సాధ్యుడనురాజు తన సైన్యముతో దశరథున కభిముఖుగా యుద్ధముఁజేయుటకు వచ్చెను. వారలిద్దరకు బరస్పరము యుద్ధము జరిగెను. దశరథుడు సాధ్యునితో నొకమాసము యుద్ధము చేసి వానినిబట్టుకొనెను. అనంతరము సాధ్యరాజపుత్త్రుడగు భూషణుడను వాడు కొలదిపరివారముతో దశరథునితో యుద్ధముచేసెను. దశరథుడు భూమికంతకు నలంకారభూతుడుగానుండిన, సాధ్యపుత్త్రుడగు భూషణునిఁ జూచి

1 లోక్యయోద్ధ్య మేవనైచ్ఛత్ కథ మేతాదృశం హన్ని
చాస్మిన్నహ్న తేఽస్యకథం పితా భవిష్యతి, కథం తన్మాతా,
కథ మప్రౌఢయౌవనా ప్రియా భార్యా, అముష్యహి
పదాని నవీనతరదళదరవిందకుసుమానీవ దృశ్యంతే ప్రీతి
వర్ధనో నామపుత్రోఽయమ ప్యాదయ మన్యథాకరోతీతి
మనసా వితర్క్య బాలకం గ్రహీతు మారభత, సచాపి
పరాధీనో బభూవ, సచకుమారేణసహ పరాఙ్ముఖేద
మమత్వా సుఖమధ్యువాస స దశరథోఽపి మాసం తత్ర
స్థిత్వా తత్పుత్రసందర్శనసుఖ మవలోక్యాఽచింతయత్.
అహో సర్వదుఃఖాపనోదనక్షమ మేతన్ముఖావలోకనం
సర్వరాష్ట్రకోఽపిజయః పుత్రవియోగ మనుస్మరణతో
దుఃఖాయ కేవలంభవతి॥ ౬౮౪.

శ్లో॥ వ్యర్థా జనిరపుత్రస్య రాజ్యశ్రీ శ్చనిరర్థకా
పుత్రవాన్ స్మృతి మాపన్న శ్శోభతే నాసుత స్తథా॥౬౫౫.

---

1. బ్రహ్మ రామాయణే.

యుద్ధముచేయుట కిచ్చగింపక యిట్లు విచారించెను. అయ్యో, నేనెట్టులనిట్టి సుకుమారుని యుద్ధమునఁ జంపుదును? వీనిఁ జంపినచో వీని తల్లిదండ్రు లెట్టుల జీవింపఁగలరు ! మఱియు నవయౌవనవతిగానుండిన యితని భార్య యెట్లు భర్తృవియోగమును సహింపఁగలదు ! ఇతని పాదములు నూతనముగా వికసించిన తామరపుష్పములవలె నెంతయో మృదువుగా నున్నవి. ఈ సాధ్యపుత్త్రుడు నాకును బ్రీతినిఁ గలుగఁజేయుచు నా హృదయమును వేఱువిధముగా మార్చుచుండెనని వితర్కించుకొనుచు, తనపైకి యుద్ధమునకు సన్నద్ధుడైవచ్చిన యీ బాలకునిఁ జంపకుండఁగఁ బట్టుకొనెను. అతఁడును పరాధీనుఁడయ్యెను. బంధితుడైన సాధ్యునియొద్దనే తత్పుత్త్రుడగు భూషణునిఁగూడ నిర్బంధములో నుంచెను. కాని, సాధ్యుడు తన పుత్త్రుడు తనదగ్గఱ నుండుటచే దనకుఁ గలిగిన పరాజయఖేదమును మఱచి సంతోషముతో నుండెను. అదళిరంగుడును, మాసమువఱకు నచ్చటనేయుండి, సాధ్యుడు తనపుత్త్రుని జూచుకొనుచుఁ బొందుచున్న యానందమును జూచి తన మనమున నిట్లు విచారించెను. ఓహో! యీపిల్లవాని ముఖదర్శనము, సమస్త దుఃఖములనుఁ బోగొట్టుటకుఁ దగియున్నది. నేను రాజుల నందఱను జయించినను నాజయము పుత్త్రులు లేని కారణముచేతను నాకు దుఃఖకరమే కాని నాకు సుఖకరము గాదని యిట్లు విచారించెను.

౭౫౪ పుత్త్రులు లేనివాని జన్మము వ్యర్థము. సంపదయు నిరర్థకము. పుత్త్రవంతుడు మృతినొందినను శోభించును. పుత్త్రహీనుడట్టుల శోభింపడు.

స్వపుత్త్రిస్తు పునో గచ్ఛేద్యస్య వైశ్వానరం మహాన్
స్వజనైర్నీయమానస్య మృతి రప్యుత్సవో భవేత్॥ ౬౬½

ఇతి సంచిన్త్య సాధ్యం తం పృష్ట్వా పుత్త్రిజనిం నృపః
హయమేధా త్పుత్త్రిజన్మ శ్రుత్వా సాధ్యముఖా త్తతః
సాధ్యం చ తత్సుతం చాపి బంధముక్తౌ విధాయ సః
అయోధ్యామగమత్త్రి ప్రంపుత్త్రాభావవిచారవాన్॥ ౬౮½

అథ మంత్రిణ మాహూయ రాజా దశరథోఽవదత్॥ ౬౯

* జరా కృతాంతదూతీవ కర్ణమూల ముపాగతా
వంశాంకురో నాభవ న్మే కిం కరోమి సుమంత్ర భోః॥ ౭౦

---

* జరాం ప్రత్యభియుక్తైరప్యుక్తం తథాహి॥ శ్లో॥ యమమివ
కరధృతదండం హరిమివ సగదం శశాంకమివ వక్రం।
శివమివ చ విరూపాక్షం జరా కరోత్యకృతపుణ్యమపి॥
గాత్రం సంకుచితం గతిర్విగళితా భ్రష్టాచ దంతావళిః
దృష్టిర్నశ్యతి వర్ధతేబధిరతా వక్త్రంచ లాలాయతే।
వాక్యంనాద్రియతేచ బాంధవజనైః భార్యా నశుశ్రూ
షతే హాకష్టం పురుషస్య జీర్ణవయసః పుత్త్రోప్యమిత్రా
యతే।

ఏతాదృశదోషభూయిష్ఠా జరామమసమాగతా పుత్త్రో
నాభూదితి దశరథః విచారయామాస॥

౯౬ పుత్రవంతుడు మృతినొందినపుడు వానిపుత్త్రుడు అగ్నిహోత్రమును బుచ్చుకొని తండ్రిశవముముందు నడుచుచుండగా బంధువులచే నాపరింపబడి శ్మశానమునకు దీసికొనిపోబడు పుత్త్రవంతుడగువాని మరణమును మహోత్సవముగానే యుండును.

౯౭-౯౮ ఇట్లు దశరథుడు తన మనమున విచారించి తన నిర్బంధమునలో నుండిన సాధ్యుడనువానిని పుత్త్రోత్పత్తిసాధనము నడిగి యాతని వలన అశ్వమేధమువలన పుత్త్రోత్పత్తి కలుగునని విని యప్పుడు సాధ్యుని, తత్పుత్త్రుడగు భూషణుని, బంధవిముక్తులనుగాc జేసి పుత్త్రులులేని విచారముతో సాకేతపురమున కేగెను.

౯౯-౧౦ అనంతరము దశరథుడు తన మంత్రియగు సుమంత్రునిc బిలిచి
* యిట్లనిc బలికెను. "ఓ సుమంత్రుడా! మృత్యుదేవతయొక్క దూతికవలె వార్ధక్యము కర్ణమూలము నాశ్రయించెను (అనగా వెంట్రుకలు నెరిసెను.) వంశాంకురము నాకింతవఱకు లేకపోయెను. ఏమిచేయుదును అని దశరథుడు సుమంత్రునితోc జెప్పి మఱియు నిట్లనియె.

---

* వ్యా॥ వార్ధక్యమునుగూర్చి ప్రాచీనులగు పండితులచే నిట్లు చెప్పcబడెను. (ఏమనః) పుణ్యము చేయకపోయినను వార్ధక్యముచే మనుజుడు యముడంతవాడగును. (అనగా దండధరుడగును. కఱ్ఱ చేతికి వచ్చునని భావము.) విష్ణుమూర్తివలె గదగలవాడగును. (అనగా రోగముగలవాcడగు నని భావము. గదయనగా రోగమనికూడ అర్థముండెను) చంద్రుడువలె వంకరగలవాడగును (అనగా ముసలితనమున వంకరలు తిరిగిపోవునని భావము) శివుడువలె విరూపాక్షుడగును. (అనగా కంటిచూపు ముసలితనములో బాగుగ నుండదని భావము) మఱియు వార్ధక్యదోషము లివ్విధముగ చెప్పబడినవి, వార్ధక్యము వచ్చుటతోడనే శరీరము ముడతలుపడిపోవును. నడక తొట్రుపడును దంతము లూడిపోవును. చూపు తగ్గును. చెవుడు వచ్చును. నోటివెంట చొంగకారును. బంధువు లాదరింపరు, భార్య చెప్పినమాట వినదు. అయ్యో? యెంతకష్టము! ముసలివానికి పుత్త్రుడుకూడ శత్రుడై వర్తిల్లును, కాన నట్టి దోషములుకలవాడగు వార్ధక్యము వచ్చినదనియు, సంతతి లేకపోయెననియు దశరథుడు విచారించెను.

శీఘ్ర మానయ మే సర్వా న్గురూం స్తాన్సపురోహితాన్
తత స్సుమంత్ర స్త్వరితం గత్వా త్వరితవిక్రమః
సమానయ త్స తా న్సర్వాన్సమస్తా న్వేదపారగాన్॥ ౭౦౫

తాన్పూజయిత్వా ధర్మాత్మా శ్లక్ష్ణం వచన మబ్రవీత్॥ ౭౨

మమ రాజ్యసుఖం వ్యర్థం। నాభూ త్పుత్రసుఖం యతః
తదర్థ మశ్వమేధేన యక్ష్యామీతిమతిర్మమ॥ ౭౩

నిశమ్య వచనం రాజ్ఞో వసిష్ఠాద్యా మహర్షయః
సాధు సాధ్వితి తే ప్రాహుః పున స్తా నబ్రవీ న్నృపః॥ ౭౪

కీదృశోఽశ్వ స్తత్ర భావ్యః కో విధి స్తత్ర పూజనే
కథంహి శక్యతే కర్తుం। కే జేయా స్తత్రవైరిణః॥ ౭౫

వసిష్ఠః॥ గంగాజలసమానేన వర్ణేన వపుషా శుభః
కర్ణే శ్యామో ముఖే రక్తః। పీతః పుచ్ఛే సులక్షితః॥ ౭౬

మనోవేగ స్సర్వగతి రుచ్చైశ్శ్రవసమప్రభః
వాజిమేధే హయః ప్రోక్తో శుభలక్షణలక్షితః॥ ౭౭

పత్రం లిఖిత్వా ఫాలే తు। స్వనామబలచిహ్నితం
మోచనీయః ప్రయత్నేన। రక్షకైః పరిరక్షితః॥ ౭౮

౧౧ "ఓసుమంత్రుఁడా! శీఘ్రముగా వసిష్ఠ వామదేవాది పురోహితులఁ దీసికొనిరమ్ము" అని దశరథుఁడు సుమంత్రునితోఁ జెప్పఁగా సుమంత్రుఁడు మహావేగముతోఁజని వేదవిదులగు వసిష్ఠాది పురోహితులను దీసికొనివచ్చెను.

౧౨ దశరథుఁడు తన గృహమునకు వచ్చిన వసిష్ఠాదిమహర్షుల నందఱను బూజించి మృదుమధురములగు వచనములతో వారితో నిట్లనియెను.

౧౩ ఓమహర్షులారా! నాకు బుత్రసుఖము లేని హేతువుచే రాజ్యసౌఖ్యమును వ్యర్థమనిభావించెదను పుత్రసంతానముకొఱకు అశ్వమేధము చేయవలెనని తలంపు నాకుగలిగినది. మీ యభిప్రాయమేమియని దశరథుఁడు వసిష్ఠాదుల నడిగెను.

౧౪ వసిష్ఠాదిమహర్షులు దశరథుని వాక్యమును విని (బాగుబాగు) అని మహర్షులందఱు సమ్మతినిఁజూపిరి (అనగా పుత్రులు కలుగుదురని చెప్పిరి) అపుడు వసిష్ఠాదులను దశరథుడు తిరిగి ప్రశ్నించెను.

౧౫ వసిష్ఠాదిమహర్షులారా! అశ్వమేధమునకట్టి లక్షణముగల యశ్వముండవలెను! విధానమేమి! ఎట్లుచేయ శక్యమగును! ఏవైరులను జయింపవలయును వీనిని సవిస్తరముగాఁ జెప్పుమని యడిగెను.

౧౬-౧౮ వసిష్ఠుడిట్లు జెప్పెను. ఓ దశరథా! గుఱ్ఱము గంగాజలమువలె తెల్లనిరంగుగలిగి యుండవలెను. చెవులయందు నలుపు, ముఖమునందెఱుపు, తోఁకయందు బచ్చదనము నుండవలయును. అడ్డులేకుండగ సర్వత్ర వెళ్ళునదిగా నుండవలెను. మనోవేగముతో సమానగమనముగలిగి యుండవలెను. వెయ్యేల? దేవేంద్రుని యశ్వమగు నుచ్చైశ్శ్రవముతో సమానముగా నుండవలెను. పైన చెప్పబడిన శుభలక్షణములుగల యశ్వము, అశ్వమేధమునకు నుపయోగించును.

౧౯ ఆ యశ్వముయొక్క లలాటమునందున నామాక్షరములతో గూడిన పత్రమును గట్టి రక్షకభటుల సహాయముతో నాయశ్వమును విడిచిపెట్టవలయును.

యత్ర గచ్ఛతి యజ్ఞాశ్వ స్తత్ర గచ్ఛంతు రక్షకాః
య స్తం బలా న్నిబధ్నాతి స్వవీర్యబలదర్పితః
తస్మా త్ప్రసభ మానేయః। పరిరక్షాకరై ర్హయః॥ ౮౯

కర్త్రా తావ త్సుధీరా స్థాతవ్యం నియమా దిహ
మృగశృంగధరో భూత్వా బ్రహ్మచర్యసమన్వితః।
వ్రతం పాలయమానశ్చ। యావద్వర్షం వ్యతిక్రమేత్ ।
తావ ద్దీనాంధకృపణాః పరితోష్యా ధనాదిభిః॥ ౯౦-౯౧

అన్నం తు బహుశో దేయం ధనం వా భూరి దీయతాం
యద్య త్ప్రార్థయతే ధీమాం స్తత్త ద్దద్యా త్కృపా
లుకః॥ ౯౨

ఏవం యః కురుతే కర్మ యజ్ఞ స్సంపూర్ణతాం గతః
కరోతి సర్వపాపానాం నాశనం రిపునాశన॥ ౯౩

తస్మా ద్భవా న్సమర్థోసి । కరణే పాలనే౽గ్చనే
కృత్వాకీర్తిం సువిపులాం పావయాన్యా స్జనా న్నృప॥ ౯౪

దశరథః॥ విలోకయ ద్విజశ్రేష్ఠ వాజిశాలాం మమా౽ధునా
తాదృశా స్సంతి నోవా శ్వాః।శుభలక్షణలక్షితాః॥ ౯౫

ఇతి శ్రుత్వా౽పి తద్వాక్యం వసిష్ఠః కరుణాకరః
ఉత్తస్థా వీక్షితుం సర్వాః యాగార్హా న్వాజిన శ్శుభాన్॥ ౯౬

౨౯ ఆ యజ్ఞాశ్వము ఎక్కడికి వెళ్ళిన నక్కడకు రక్షకభటులు దాని ననుసరించి వెళ్ళవలయును. ఎవరైనా యశ్వమును బలాత్కారముగఁ బట్టుకొనునో వానిని జయించి యశ్వమును రక్షకభటులు తీసికొని రావలయును.

౩౦-౩౧ యాగము చేయువాడు సంవత్సరకాలము లేడికొమ్ములను ధరించి బ్రహ్మచర్యమును జరుపుచు నియమముతో నుండవలయు. సంవత్సరకాలమంతయు దీక్షలోనుండి దీనులను గ్రుడ్డివాండ్రను మఱియు నితరులకందఱకు ధనము మొదలగువానిచే సంతోషమును జేయవలయును.

౩౨ అన్నదానము విశేషముగా జేయవలయును. ధనము కూడవిశేషముగా దానము చేయవలెను. ఎవడు దేని నడిగిన దానినంతయు నిచ్చుచుండవలయును.

౩౩ ఓ దశరథా! పైవిధముగా నెవడు యజ్ఞమును సంపూర్తిగఁ జేయునో వాని సర్వపాపములు నశించును.

౩౪ "ఓ దశరథా! నీవు యజ్ఞమును జేయుటకును అశ్వమును బాలించుటకును బెద్దలను బూజించుటకును సమర్థుడవు. యాగమునుజేసి కీర్తిని సంపాదించి యితరులనుగూడ పవిత్రము చేయుము" అని వసిష్ఠుడు దశరథునితో జెప్పెను.

౩౫ దశరథుడు తిరిగి వసిష్ఠునితో నిటులఁ బ్రశ్నించెను. "ఓ వసిష్ఠ మహర్షి! నీవు అశ్వశాలను బరీక్షింపుము; అశ్వమేధమునకు దగిన శుభలక్షణములుగల యశ్వములు అశ్వశాలలో నున్నవో లేవో చూడు" మని దశరథుడు వసిష్ఠునితో జెప్పెను.

౩౬ దయాసముద్రుడగు వసిష్ఠుడు దశరథుని వాక్యమును విని వెంటనే యాగాశ్వములను జూచుటకు లేచి యశ్వశాలకేగెను.

1 దృష్ట్వా వసిష్ఠ స్తు హయా న్రాజాన మిద మబ్రవీత్
హయమేధక్రతో ర్యోగ్యా న్హయాంస్తే బహుశ శ్శుభాః

పశ్యతో న్నేత్రయో ర్మేద్య తృప్తి ర్నా స్తి రఘూత్తమ
సరయ్వా శ్చోత్తరే తీరే యజ్ఞభూమి ర్విధీయతాం ౮౮॥

సంభారా స్సంభ్రియంతాం చ తురగ శ్చ విముచ్యతాం
ఫాలే బధ్వా పట్ట మేకం స్వనామాంకోపశోభితం
ఇత్యుక్త్వాథ వశిష్ఠ స్తు స్వాశ్రమం గతవా నభూత్
సర్వేమహర్షయ స్తస్య సంకల్పం చాశ్వమేధికం
శ్లాఘయిత్వా స్వస్వ పదం గతా దశరథాజ్ఞయా
రాజాపిసర్వసంభారా న్సంసిద్ధాంస్తుచకారసః॥౮౯-౯౦-౯౧

ఇత్యాశ్చర్యరామాయణే సప్తమ స్సర్గ స్సమాప్తః

---

1. పా॥ రా॥

౮౭-౮౮ వసిష్ఠుడశ్వశాలలోని గుఱ్ఱములను జూచి దశరథునితో నిట్లు బలికెను. ఓదశరథా ! నీ యశ్వశాలలో యాగార్హములగు గుఱ్ఱము లనేకములుండెను. ఆగుఱ్ఱములను జూచిన నానేత్రములకుతనివి తీర లేదు (ఇంకను జూడవలెననియే కోరిక యుదయించుచున్నదని భావము.)

౮౯ ఓదశరథా! ఆలస్యమేల, వెంటనే సరయూనది కుత్తరభాగమున యాగభూమి నేర్పరుచుము, సమస్తసంభారములను సిదముచేయుము ఆశ్వలలాటమునందు స్వనామాక్షరములతో గూడిన పట్టమును గట్టి యాయశ్వమును విడువుము అని వసిష్ఠుడు దశరథునితో జెప్పి తన యాశ్రమమునకు వెళ్ళెను.

౯౦-౯౧ మహార్షులందఱు దశరథుని యశ్వమేధసంకల్పమును గొనియాడి దశరథునియనుమతి నొంది తమతమ తావులకేగిరి - పిమ్మట దశరథుడును కావలసిన సంభారములను సిదముచేసెను.

ఆశ్చర్య రామాయణమున సప్తమసర్గము ముగిసెను.



## అష్టమసర్గప్రారంభః.

ఏత చ్ఛ్రుత్వా రహస్సూతో రాజాన మిద మబ్రవీత్
ఋత్విగ్భి రుపదిష్టోఽయం పురావృత్తో మయా శ్రుతః॥
అహ మిక్ష్వాకుసారథ్యం కుర్వ న్బ్రహ్మసభాం గతః
తత్ర భావిమహీపాలప్రసఙ్గే తవ భూపతే
అపుత్రత్వం యదా ప్రోక్త మృషిభి ర్విధిసంసది
సనత్కుమారో భగవా న్మహర్షీ నవద త్తదా॥ ౧-౩

ఋష్యశృఙ్గం పురస్కృత్య స తు యజ్ఞం కరిష్యతి
పుత్రా స్తస్య భవిష్యన్తి చత్వారోఽమితవిక్రమాః॥ ౪

ఏవం స దేవప్రవరః పూర్వం కథితవా న్కథాం
తదుక్తం బ్రహ్మసదసి వాక్య మశ్రౌష మప్యహం
త దృష్యశృఙ్గ మానీయ సమాచర నృప క్రతుం॥ ౫

ఋష్యశృఙ్గస్య చరితం శ్రుతం తత్ర వదామి తే
శృణుష్వ రాజశార్దూల జన్మకర్మాదికం మునేః॥ ౬

ఏకదా కాశ్యప స్స్నాతుం విభాణ్డకమహామునిః
మహాహ్రదం గత స్తత్ర మజ్జితస్మ మహీపతే॥
తస్య రేతః ప్రచస్కన్ద దృష్ట్వాఽప్సరసమూర్వశీం॥ ౭-౮

## అష్టమ సర్గప్రారంభము.

౧ సుమంత్రుడు వసిష్ఠాదులు చెప్పిన వాక్యములను విని దశరథమహారాజుతో నివ్విధముగ బలికెను. ఓరాజా! వసిష్ఠాదులు చెప్పినట్లే పూర్వమునందొకరు చెప్పగా నొకకథను వినియుంటిని (చెప్పెదను వినుము)

౨-౩ నేను పూర్వకాలమునం దిక్ష్వాకుమహారాజునకు రథసారథినైయుండి ఇక్ష్వాకువు బ్రహ్మసభకు వెళ్ళుచుండగా నేనుగూడ నతనితో బ్రహ్మసభకు వెళ్ళియుంటిని. అచ్చట భావికాలపు రాజుల విషయమైన ప్రసంగము రాగా నీప్రసంగము కూడ వచ్చెను. అప్పుడచ్చటి మహర్షులు కొందఱు నీకు పుత్రసంతానముండదని చెప్పగా సనత్కుమార మహర్షి విని యామహర్షులతో నిట్లు చెప్పె.

౪ ఓమహర్షులారా! దశరథునకు పుత్రసంతానముండదని మీరు చెప్పుట యథార్థము కాదు. ఆదశరథుడు ఋష్యశృంగ మహర్షిం దీసికొనివచ్చి యజ్ఞమునుజేయును ఆమ్మట దశరథునకు మహాపరాక్రమవంతులగు నల్వురుపుత్రులు కలుగుదురు.

౫ ఇవ్విధముగ దేవర్షియగు సనత్కుమారుడు చెప్పుచుండగ నేను గూడ బ్రహ్మసభలో నమ్మహర్షి చెప్పినవాక్యములను వినియుంటిని ఆకారణమువలన ఋష్యశృంగమహర్షినిం దీసికొనివచ్చి యాగమును జేయుమని సుమంత్రుడు దశరథునితోం జెప్పెను.

౬ ఓరాజా! ఋష్యశృంగ చరితమునుగూడ నచ్చట వినియుంటిని. ఆమహర్షియొక్క జననము ప్రభావము మొదలగు వానిని జెప్పెదను వినుమని చెప్పనారంభించెను.

౭-౮ ఓరాజా! ఒకానొకప్పుడు, కశ్యపవంశీకుడగు విభాండకమహర్షి స్నానార్థమై యొకకొలనకు వెళ్ళి స్నానముచేయుచుండెను. ఆసమయమున, ఊర్వశియను నప్సరస కన్పడగా నమ్మునికి రేతస్స్ఖలనమై జలములోం బడెను.

అపూర్వపస్వ్ర్యతే రాజ న్మృగీ తచ్చా౽పిబత్తదా॥
సహతోయేన తృషితా గర్భిణీ సమభూ త్తతః
పుత్త్రం ప్రసూయ సా శాపవిముక్తా స్వర్గతా భవత్॥ ౯౫

* సాపురోక్తా భగవతా బ్రహ్మణా లోకకర్తృణా
దేవకన్యే మృగీ భూత్వా మునిం సూయ విమోక్ష్యసే॥౧౦౫

అమోఘత్వా ద్దృష్టేశ్చైవ భావిత్వా ద్దైవనిర్మితేః
తస్యాం మృగ్యాం సమభవ త్తస్య పుత్త్రో మహీపతే
పిత్రా నీతో ఋష్యశృంగః।వనఏవా౽భ్యవర్ధత॥ ౧౧-౧౨

---

* దేవకన్యేతి - చిత్రరేఖానామ కాచన దేవకన్యా బ్రహ్మణ స్సదసి ప్రత్యహం నృత్యతిస్మ ఏకదానర్తనసమయే ఃథ మపశ్యంతీ పరాఙ్ముఖీ సా యదా ననర్త తదా పితామహః కుపిత స్తాం శశాప త్వం మృగీ భవేతి. తయా శాపవిముక్తిం ప్రతి ప్రార్థిత శ్చాత్మభూ రనుగృహ్యైనా మువాదీత్, యదా త్వం మునిబాలకం ప్రసూతవతీ భవే స్తదా విమోక్ష్యసే, ఇతికథానుసంధేయా.

౯౪ ఓ దశరథా! ఎక్కడనుండియో యొక యాఁడులేడి దాహమై యా కొలకునకు వచ్చి నీరు త్రాగుచుండఁగా విభాండకమహర్షి యొక్క రేతస్సు జలముతోఁగూడ లేడిగర్భములోనికిఁ బోయెను. ఆ లేడియు గర్భవతియై వెంటనే యొకపుత్త్రునిఁ గని శాపవిముక్తురాలై దివ్యరూపముతో స్వర్గమున కేగెను.

*౧౦౪ ఆ లేడి, పూర్వకాలమునం దొక దేవకన్యకయై యుండెను. సృష్టికర్త యగు బ్రహ్మదేవుఁ డొకప్పు డా దేవకన్యకను లేడిరూపము నొందుమని శపింపఁగా, నా దేవకన్యక శాపవిమోచనమును గోరఁగా ముని పుత్త్రునిఁ గనినవెంటనే శాపవిముక్తి యగునని బ్రహ్మ చెప్పిన కారణమున బుత్త్రునిఁగని శాపవిముక్తురాలై స్వర్గమున కేగెను.

౧౧-౧౨ విభాండకమహర్షి, యమోఘవీర్యము గలవాఁ డగుటవలన దైవలిఖితము జరుగవలసియున్న హేతువు చేతను ఆ యాఁడులేడియందు విభాండకమహర్షి వీర్యమువలన ఋష్యశృంగుఁడు ఉద్భవించినపిదప విభాండకమహర్షియు సర్వము నెఱిఁగి, తన పుత్త్రుని స్వాశ్రమమునకుఁ దీసికొనివెళ్ళఁగా నచ్చట ఋష్యశృంగుఁడు పెరుగుచుండెను.

---

* చిత్రరేఖయను నొక దేవకన్యక బ్రహ్మసభలో ప్రతిదినము నృత్యము చేయుచుండెడిదై యుండెను. ఒకప్పుడు నృత్యము చేయుచున్న సమయమున బ్రహ్మవంకఁ జూడకుండఁ నితరుల కభిముఖురాలై నృత్యము చేయుచుండెను. బ్రహ్మయుఁ గోపమంది యామెను ఆఁడులేడియగునటుల శపించెను. అప్పుడామె, శాపవిముక్తినిఁ బ్రార్థింపఁగా బ్రహ్మ యనుగ్రహించి, యిట్టుఁ జెప్పెను. నీవు ఋషిపుత్త్రునిఁ గనినవెంటనే శాపవిముక్తురాలవగుదువనెను. కథ యనుసంధేయము.

శృంగం శిరసి తస్యాసీః రాజ న్నాసీ న్మహాత్మనః
తేనర్ష్యశృంగ ఇత్యేవ సదా ప్రథితో ౽ భవత్॥ ౧౩

న తేన దృష్టః పూర్వో ౽ న్యః పితు రన్యత్ర మానుషః
తస్మాత్తస్య మనో నిత్యం బ్రహ్మచర్యే ౽ భవ న్నృప॥౧౪

* ఏతస్మిన్నేవ కాలేతు సఖ్యా తవ మహీపతే
తేన కామా త్కృతం మిథ్యా బ్రాహ్మణస్యేతి విశ్రుతం
స బ్రాహ్మణైః పరిత్యక్త స్తదా వై జగతీపతిః॥ ౧౫

1 పురోహితాపచారాచ్చ తస్య రాజ్ఞో యదృచ్ఛయా
న వవర్ష సహస్రాక్ష స్తతో ౽ పీడ్యత తత్ప్రజా॥ ౧౬

---

* వ్యా॥ మిథ్యా బ్రాహ్మణస్యేతి రోమపాద ప్రత్యహం బాడబానాం దానధర్మాదికం కరోతిస్మ ఏకస్మిన్దినే కశ్చన బాడబః రోమపాదాదేకవారం దానం గృహీత్వా పునరాదాతుం సమాగతో ౽ భూత్॥ తదా రోమపాదః మిథ్యావాదిత్వం బ్రాహ్మణజాతావారోపితవాన్ తదా సర్వేపి బాడబాః రోమపాదం తత్యజుః, కించ తద్దేశే త్రేనావృష్టి స్సంభవేదితి శశపుశ్చతే. ఇతికథాత్రానుసంధేయా.

---

1. అధ్యాత్మరామాయణే. స॥

౧౩ ఓ దశరథమహారాజా! మహాత్ముడగు ఋష్యశృంగుని శిరస్సునందు, మాతృచిహ్నమును సూచించెడి లేడికొమ్ముకూడ నొకటి యుండెను. ఆ కారణముచేతనే ఋష్యశృంగుడని ప్రసిద్ధికల వాడయ్యెను. ( నెత్తిమీదను లేడికొమ్ముగల ఋషియని ఋష్యశృంగుడను పదమున కర్థమని యెఱుగనగు )

౧౪ ఆ ఋష్యశృంగుడుని భాండక మహర్షి యాశ్రమమునందుఁ దపోనిష్ఠుడై యుండి, తనతండ్రికంటె, నన్యుని నెప్పుడు చూడకపోయినకారణముచే నమ్మహర్షి యొక్క మనస్సు, నిత్యము పరబ్రహ్మమునందే, లగ్నమైయుండెను.

* ౧౫ ఓ రాజా! ఈసమయముననే నీస్నేహితుడగు రోమపాదుడు, బ్రాహ్మణు లసత్యవాదులని బ్రాహ్మణులయందు మిథ్యావాదిత్వదూషణ నారోపించుటచే బ్రాహ్మణులచే నతడు పరిత్యజింపఁబడెను.

౧౬ పురోహిత బ్రాహ్మణాపచారములను రోమపాదుఁడు చేయుటవలన దేవేంద్రుడు, అంగదేశమున వర్షింపకపోయెను. అనావృష్టిదోషముచే ప్రజలు పీడింపఁబడుచుండిరి.

---

* వ్యా॥ రోమపాదుడు ప్రతిదినమున బ్రాహ్మణులకు దానముచేయుచుండెను. ఒకదినమున నొకబ్రాహ్మణుడు రోమపాదునివలనఁ నొకపర్యాయము దానము గ్రహించి తిరిగి గ్రహించుటకు రాజా నొద్దకురాగా రోమపాదుడప్పుడు, బ్రాహ్మణులందఱు, అబద్ధమాడువారనియు, అతిపాతకులనియు దూషింపగా బ్రాహ్మణులందఱు రోమపాదుని త్యజించిరి, మఱియు నతనిదేశమున వర్షము లేకుండ నుండునట్లుశపించిరి. యను కథగ్రాహ్యము.

స బ్రాహ్మణా న్పర్యపృచ్ఛ త్తపోయుక్తా న్మనీషిణః
ప్రవర్తనే సురేంద్రస్య సమర్థా న్పృథివీపతిః
కథం ప్రవర్తేత్పర్జన్య ఉపాయః పరిదృశ్యతాం॥ ౧౭-౧౮

త మూచు శ్చోదితా స్తేన సుకృతాని మనీషిణః
తత్ర త్వేకో మునివర స్తం రాజాన మువాచ హ॥ ౧౯

1* కుపితా స్తవ రాజేంద్ర బ్రాహ్మణా నిష్కృతిం చర
ఋష్యశృంగం మునిసుత మానయస్వ చ పార్థివ॥ ౨౦

2* సచే దవతరే ద్రాజ న్విషయం తే మహాతపాః
సద్యః ప్రవర్తే త్పర్జన్య ఇతి తే నాత్ర సంశయః॥ ౨౧

ఏత చ్ఛ్రుత్వా వచో రాజ న్కృత్వా నిష్కృతిమాత్మనః
స గత్వా పున రాగచ్ఛ త్ప్రసన్నేషు ద్విజాతిషు
రాజాన మాగతం దృష్ట్వా ప్రతిసంజహృషుః ప్రజాః॥ ౨౨

తతో౽ంగపతి రాహూయ సచివా న్మంత్రకోవిదాన్
ఋష్యశృంగాగమే యత్న మకరో న్మంత్రనిశ్చయాత్॥ ౨౩

సో౽ధ్యగచ్ఛ దుపాయం తు । తై రమాత్యైర్మహీపతే
శాస్త్రజ్ఞై రఖిలార్థజ్ఞై ర్నీతజ్ఞం చ పరినిష్ఠితైః॥ ౨౪

తత్ర త్వాజ్ఞాపయామాస వారముఖ్యా మహీపతిః
వేశ్యాః సర్వత్ర నిష్ణాతా స్తా ఉవాచ మహీపతిః॥ ౨౫.

---

1. * బ్రాహ్మణాపచారో నకర్తవ్య ఇతిసూచ్యతే.

2. * అస్ఖలితబ్రహ్మచారిణ్యో తాదృశ మహిమా స్తీతి సూచితం.

౧౭-౧౮ ఓదశరథమహారాజా! వర్షింపజేయుటకు సమర్థులు తపస్సంపన్నులు నగు బ్రాహ్మణులయొద్దకు రోమపాదుడేగి వారినిట్లు ప్రశ్నించెను. ఓ బ్రాహ్మణులారా! దేవేంద్రుడేవిధముచే వర్షించును! ఉపాయమును విచారింపుడని రోమపాదుడు బ్రాహ్మణులనడిగెను.

౧౯ అప్పుడు బ్రాహ్మణులు రోమపాదునితో నిట్లుచెప్పిరి ఓరాజా! పుణ్యవశముచే దేవేంద్రుడు వర్షము కురిపించవలసినదికాని వేఱు మార్గము లేదనిరి. వారిలో నొక మునీశ్వరుడు రాజుతో నివ్విధముగ జెప్పెను.

1* ౨౦ ఓరాజా! నీవిషయమై బ్రాహ్మణులందఱు, కోపగించిరి. వారిని ప్రసన్నులను గా జేసికొనుము. విభాండకమహర్షి పుత్రుడగు ఋష్యశృంగుని నీపట్టణమునకు దీసికొనిరమ్ము.

2* ౨౧-౨౨ ఓరోమపాదుడా! ఋష్యశృంగుడు నీదేశమున ప్రవేశించినచో మేఘుడు వెంటనె వర్షించును. సందియములేదని యొక బ్రాహ్మణుడు చెప్పెను.

౨౨ ఈవాక్యము రోమపాదుడు విని బ్రాహ్మణుల సన్నిధికేగి వారి ననేకవిధములుగ సంతుష్టులను గాజేసి తిరిగి తనచంపా పట్టణమునకు రాగా ఋషులందఱు సంతోషించిరి.

౨౩ అనంతరము రోమపాదుడాలోచనపరులగు మంత్రులనుబిలిచి ఋష్యశృంగుని దీసుకొనివచ్చెడి విషయమై వారితో నాలోచించెను.

౨౪ శాస్త్రజ్ఞులును, కార్యసాధకులునగు మంత్రులతో రోమపాదుడాలోచించి వేశ్యలద్వారా ఋష్యశృంగుని తనరాజ్యమునకు రప్పించుటకు నిశ్చయించెను.

౨౫ రోమపాదుడు వేశ్యలనందఱిని బిలిపింపగా వారలందఱు రాజునొద్దకువచ్చిరి అప్పుడు రోమపాదుడా వేశ్యలతో నిట్లుపలికెను.

---

1 * ఈ కథవలన బ్రాహ్మణాపచారము చేయగూడదని సూచితము.

2 * దీనివలన అస్ఖలితబ్రహ్మచారియందలి మహిమ సూచింపబడినది.

ఋష్యశృంగ మృషేః పుత్రీ మానయధ్వ ముపాయతః
లోభయిత్వా సమాశ్వాస్య విషయం మమ శోభనాః॥ ౨౬

తా రాజభయభీతా శ్చ । శాపభీతా శ్చ యోషితః
అశక్య మూచు స్తత్కర్తు వివర్ణా గతచేతసః॥ ౨౭

తత్ర త్వేకా వారయోషా రాజాన మిద మబ్రవీత్
ప్రయతిష్యే మహారాజ త మానేతుం తపోధనం॥ ౨౮

అభిప్రేతాం స్తు మే కామాం స్త్వ మనుజ్ఞాతుమర్హసి
తత శ్శక్ష్యా మ్యానయితుమృష్యశృంగమృషేస్సుతం। ౨౯

తస్యా స్సర్వ మభిప్రేత మన్వజానీత పార్థివః
నావి వృక్షా నథాశోప్య ఫలాకారాం శ్చ మోదకాన్
సురసాం శ్చ సుగంధీని మధూని రసవంతి చ
తతో రూపేణ సంపన్నా వయసా చ మహీపతే
స్త్రియ ఆదాయ కాశ్చిత్సా జగామ వన మంజసా॥
౩౦-౩౧-౩౨

సా తు స్థిత్వా కియద్దూరం సంస్థాప్య శ్రమ ముత్తమం
దృష్ట్వాంతరం కాశ్యపస్య ప్రాహిణోత్ తత్ర పుత్రికాం॥ ౩౩

సా తత్ర గత్వా కుశలీ తపోనిష్ఠస్య సన్నిధౌ
ఆశ్రమం తు సమాసాద్య దదర్శ త మృషే స్సుతం॥ ౩౪

౨౬ ఓ వేశ్యలారా! విభాండకమహర్షి పుత్రుడగు ఋష్యశృంగుని నెవ్విధముచేతనైనను నిచ్చటకు దీసికొనిరండని రోమపాదుడు వేశ్యలతో జెప్పెను.

౨౭ అప్పుడు వేశ్యలందఱు రాజభయముచేతను, శాపభయముచేతను కాంతివిహీనులై మనస్స్వాస్థ్యములేనివారలై ఋష్యశృంగునిఁదీసికొని వచ్చుట యశక్యమని చెప్పిరి. (అనగా వెళ్ళకున్న రాజు దండించు ననియు వెళ్ళినచో ముని శపించుననియు భయపడిరని భావము.)

౨౮-౨౯ వారిలో నొకవేశ్య రాజుతో నివ్విధముగఁబలికెను ఓ మహారాజా! ఋష్యశృంగుని దీసికొనివచ్చుటకు బయత్నించెదను నాకు కావలసిన వస్తుసంభారములను సిద్ధముఁజేయించినచో ఋష్యశృంగుని దీసికొనివచ్చుటకు నాకు సమర్థతకలదనియెను.

౩౦-౩౧-౩౨ అనంతరము రోమపాదుడు వేశ్యకు గావలసిన వస్తుసంభారముల నడిగి తెలిసికొని యొక నావయందు కృత్రిమవృక్షముల నేర్పఱచి ఫలములయొక్క యాకారముగ భక్ష్యములను సిద్ధముజేయించి వానిని నావయందుంచియు సువాసనగల రసవంతములైన రసాయనములనాయత్తపరచియు నామెకోరినవిధముగ సమస్తము రాజునొనగూర్చి పిమ్మట నావేశ్య, సౌందర్యవతులు యౌవనవతులునగు మఱికొందఱు వేశ్యాస్త్రీలను వెంటదీసుకొని ఋష్యశృంగుని యాశ్రమ సమీపమునకు వెళ్ళెను.

౩౩ ఆవేశ్య ఋష్యశృంగుని యాశ్రమమునకు గొంతదూరమున దనపడవను నిలిపి యొక్క యాశ్రమమును గల్పించుకొని విభాండకమహర్షి లేని సమయమును జూచి తనపుత్రికను ఋష్యశృంగుని సమీపమునకుఁ బంపెను.

౩౪ ఆవేశ్యాపుత్రిక, తపోనిష్ఠుడగు ఋష్యశృంగుని యాశ్రమమునకేగి యమ్మహర్షిని జూచి యివ్విధముగ కుశలప్రశ్నములను జేసెను.

1 కచ్చిత్తపో వర్ధతే తాపసానాం కచ్చిత్తరోర్మూల
ఫలం ప్రభూతం
కచ్చిత్త్వయా ప్రీయతే చైవ విప్ర కచ్చిత్స్వాధ్యాయః
క్రియతే చర్ష్యశృంగ॥ ౩౫

ఇతి శ్రుత్వావచ స్తస్య మునివేషధరస్య హి
ఉవాచ వాక్యం వాక్యజ్ఞో మునివేషవిధారిణీం ౩౬

బుధ్యాథవాన్జ్యోతి రివ ప్రకాశతే మన్యేచాహం త్వా
మభివాదనీయం, పాద్యంచాహం సంప్రదాస్యామి తే౽ద్య
యథాసిద్ధ్యై తర్మూలఫలాసచైవ॥ ౩౭

కాశ్యాం బృస్యామాస్వ యథోపవేశం కృష్ణాజినే వా
స్తృతాయాం సుఖాయాం
క్వ చాశ్రమ స్తవ కిం నామచేదం బ్రాహ్మ్యం భాతి
తదేవ వ్యక్తం॥ ౩౮

తతో వేశ్యా ప్రత్యువాచ ద్విజేంద్రం శంకాయుక్తా
కశ్యపస్యాగమే తు
మమా౽శ్రమః కాశ్యపపుత్త్ర రమ్య స్త్రియోజనం శైల
ఋమం పరేణ॥ ౩౯

తత్ర స్వధర్మో౽నభివాదనం మే న చోదకం పాద్య
మిమం స్పృశామి॥ ౩౯-౪

---

1. అధ్యాత్మరామాయణే.

౩౫ ఓ ఋష్యశృంగమహర్షి! ఆశ్రమవాసులగు మహర్షులందఱకుదపస్సు బాగుగజరుగుచున్నదా! కందమూలఫలాము విస్తారముగ లభించు చున్నవా! స్వాధ్యాయము హోమము మొదలగునవి బాగుగ జరుగు చున్నవా (అని ప్రశ్నించెను.)

౩౬ ఋష్యశృంగుడు మునివేషధారిణియగు వేశ్యయొక్క మనోహర వాక్యములను విని యావేశ్యనుగూర్చి యిటులఁబలికెను.

౩౭ నీవు సాక్షాత్పరబ్రహ్మవలె ప్రకాశించుచున్నావు. నీవు నమస్క రింపఁదగినవాడవు. నేనుచేసిన తపస్సంతయు నేనుసిద్ధించునటుల నర్ఘ్యపాద్యాదుల నిచ్చెదను. స్వీకరింపుము.

౩౮ నీవు కుశాసనమునందుఁగాని కృష్ణాజినమునందుఁగాని సంతోషము తోఁగూర్చుండుము. నీయాశ్రమ మెక్కడనున్నది! నీ పేరేమి! నీవు సాక్షాద్బ్రహ్మ దేవుడవై యిచ్చట బ్రకాశించుచున్నావు (అని ఋష్యశృంగుడు వేశ్యతోబలికెను.

౩౯ అనంతరము వేశ్య, విభాండకమహర్షి వచ్చునేమోయను సందేహము కలిగిఋష్యశృంగునిగూర్చి యివ్విధముగ బలికెను. ఓ ఋష్యశృంగ మహర్షీ! మా యాశ్రమము మిక్కిలి రమణీయముగా నుండును ఇచ్చ టికి బండ్రెండుక్రోసుల దూరములోనున్నది.

భవతా నాభివాద్యోహ మభివాద్యో భవా న్మయా
ప్రణ మేతాదృశం బ్రహ్మ న్పరిష్వజ్యో భవా న్మయా
ఇతి శ్రుత్వా వచ స్తస్య పున రాహా తపోధనః॥ ४० ४१

ఫలానిపక్వాని దదాని తేऽహంభల్లాతకాన్యామలకానిచైవ
కరూషకానీంగుదకాని తావదశ్వత్థోపజోషం ఫలమత్ర
భుంక్ష్వ॥ ४२

సా తాని సర్వాణి చ వర్జయిత్వాభక్ష్యాంమహార్హాణి
ప్రదదౌతతోऽస్య
తాన్యస్యభక్ష్యాణ్యంగస్య మహారసాని భృశం సురూపాణి
రుచిం దధుర్హి॥ ४३

తదా చుచుంబా మలగండమూలే సమాశ్లిష చ్చాపసత్వ
ద్వ్యభృశ్యంగం
అవేక్ష్యమాణా శనకై ర్జగామ కృత్వాగ్నిహోత్రస్య
తదాప దేశం॥ ४४

తస్యాం గతాయాం మదనేన చిత్తవిచేతనః ప్రీతిద దృష్ట్యా
శ్యంగః
తా మేవ చిత్తేన గతేన శూన్యో వినిశ్వస న్నార్తవపు
ర్బభూవ॥ ४५

౪౦-౪౧ ఋష్యశృంగమహర్షీ! మా నిజధర్మములను జెప్పెదను వినుము. మేము ఇతరుల నమస్కారములను స్వీకరింపము. మఱియు నితరుల యర్ఘ్యపాద్యాదులనుగూడ గ్రహింపము కాన నీవు నాకు నమస్కరింపకుము. నేను నీకు నమస్కరించెదను. ఈ సమయమున నిది మా వ్రతము. నిన్ను నేను కౌఁగిలించుకొనెదనని యవ్విధముగఁ జేసెను. ఇవ్విధముగా వేశ్యావచనములను విని ఋష్యశృంగుడు తిరిగి వేశ్యతో నిట్లు పలికెను.

౪౨ నీకు జీడిమామిడిపండ్లను ఉసిరికఫలములను ఇంగుదీఫలములను మఱియు నితరములగు ననేక కందమూలఫలాదుల నిచ్చెదను. భుజింపుమని యా ఫలములను, మునివేషధారిణియగు వేశ్యకు ఋష్యశృంగు డిచ్చెను.

౪౩ అప్పుడు మునివేషధారిణియగు వేశ్య, ఋష్యశృంగునిచే, నీయఁబడిన ఫలముల నన్నిటిని విడిచి, తనచే దీసికొనిరాబడిన మధురములగు భక్ష్యములను ఋష్యశృంగునకు నీయగా ఋష్యశృంగుని వాని నన్నిటిని భక్షించెను. ఆ భక్ష్యములన్నియు మహర్షికి రుచికరములుగా నుండెను.

౪౪. అప్పుడు మునివేషధారిణియగు వేశ్య, ఋష్యశృంగుని గండస్థలము నందు ముద్దుపెట్టుకొనెను. మఱియు ఋష్యశృంగుని నాలింగనము జేసికొనెను. ఇట్లు చేసి వేశ్య, తా నగ్నిహోత్రమును జేసికొన వలయుననెడి మిషతో మెల్లగా దన నివాసమునకు వెళ్ళెను. ఋష్యశృంగుడామెనుఁ జూచుచునే యుండెను.

౪౫ ఆ వేశ్య వెళ్ళినపిమ్మట, ఋష్యశృంగుడు మన్మథవికారములతో గూడి మునివేషధారిణియగు నా వేశ్యనే మనమునందుఁ దలచుచు నిట్టూర్పు విడుచుచు, శరీరములో బాధగలవాఁడువలె నుండెను.

తతో ముహూర్తం హరిపింగళాక్షః ప్రవేష్టితో రోమభి రానఖాగ్రాత్
స్వాధ్యాయవాన్ వృష్టసమాధియుక్తో విభాండకః కాశ్యప ఆవిరాసీత్॥ ౪౮

సోఽపశ్య దాసీన ముపేత్య పుత్రం ధ్యాయంత మేవం విపరీతచిత్తం
వినిశ్వసన్తం ముహు రూర్ధ్వదృష్టిం విభాండకః పుత్ర ముదాచ దీనం॥ ౪౯

నత్వం యథా పూర్వమివాసి పుత్ర చింతాపర శ్చాపి విచేతనశ్చ
దీనోఽతిమాత్రం త్వ మిహాద్య కింను పృచ్ఛామి త్వాం క ఇహా భ్యాగతోఽభూత్॥ ౫౦

నకల్ప్యంతే సమిధః కింను తాత కచ్చి ద్ధుతం చాగ్ని హోత్రం త్వయాఽద్య
సునిర్ణిక్తం స్రుక్స్రువం హోమధేనుః కచ్చి త్సవత్సా చ కృతా త్వయాఽద్య॥ ౫౧

ఋష్యశృంగః ॥శ్లో॥ ఇహా గతో జటిలో బ్రహ్మచారీ నవై హ్రస్వో నాతిదీర్ఘో మనస్వీ
సువర్ణవర్ణః కమలాయతాక్షః సుతః సురాణామివ శోభ మానః॥ ౫౨

౪౬ అనంతరము కశ్యపపుత్త్రుడును, స్వాధ్యాయవేత్తయు, సమాధివంతుడును నఖశిఖాపర్యంతము రోమములతో నిండినవాడునగు విభాండకమహర్షి క్షణకాలములో స్వాశ్రమమునకు వచ్చెను.

౪౭ విభాండకమహర్షి తన యాశ్రమమునకు వచ్చి పుత్త్రునిఁ జూడగా నతడు దేనినో ధ్యానించుచున్నవాడుగాను, విపరీతచిత్తుడుగాను, మాటిమాటికి నిట్టూర్పువిడుచువాడుగాను, కన్పడినందున దీనభావముతో నున్న పుత్త్రుడగు ఋష్యశృంగుని గూర్చి విభాండకమహర్షి యివ్విధముగఁ బలికెను.

౪౮ పుత్త్రుడా! నీవు పూర్వమువలె కన్పడవు, ఎందువలన విచారముతో నున్నవాడవుగాను మనఃస్థిమితము లేనివాడవుగాను దుఃఖితుడవుగాను కన్పడుచుంటివి కారణమేమి, ఇచ్చటి కెవ్వరైనను వచ్చిరా!

౪౯ సమిధలను దెచ్చితివా! అగ్నిహోత్రమును జేసితివా! యజ్ఞపాత్రలను స్రుక్స్రువములను శుభ్రము చేసితివా! హోమధేనువును బాలుపితికితివా! (అని విభాండకమహర్షి, పుత్త్రుడగు ఋష్యశృంగునిఁ బ్రశ్నించెను.

౫౦ ఋష్యశృంగుడు తండ్రితో నివ్విధముగ జెప్పనారంభించెను. ఓతండ్రీ! ఇచ్చటకు జటాధారియగు బ్రహ్మచారి యొకడు వచ్చెను. అతడు విశేషముగా పొట్టివాడుగాగాని పొడగరిగాగాని లేడు సమాంగుడై యుండెను. మేలిమిబంగారముతో సమానమగు వర్ణము గలవాడై యుండెను. పద్మపత్రములవలె విశాలనేత్రములు గలవాడై యుండెను. మరియు దేవతలను గూడ మోహింపజేయు వాడుగా నుండెను.

ఆలంబమానా పునరస్య కంఠే విరాజతే విద్యుదివాంతరిక్షే
ద్వౌ మాంసపిండౌ వధరేణ కంఠాదలోమశౌ చాపి మనోహరౌ చ॥ ౧౧

నచాపి పాద్యం బహుమన్యతేఽసౌ ఫలాని చైతాని మయాహృతాని
మయోపభుక్తాని ఫలాని తస్య నేమాని తుల్యాని రసేన తేషాం॥ ౧౨

ఇచ్ఛామి తస్యాంతికమేవ తాత గానామ సా వ్రతచర్యాను తస్య। ఇచ్ఛామ్యహం చరితుం తేన సార్థం యథా తపస్సచరత్యుగ్రకర్మా॥ ౧౩

ఇత్యేవ వాక్యం మునిరాత్మజస్య శ్రుత్వా మహావాక్యవిశారదోఽసౌ। ఉవాచ వాక్యం పరిశాంతయంశ్చ విభాండకస్తపసా జ్ఞాతతత్త్వః॥ ౧౪

రక్షాంసి చైతాని చరంతి పుత్ర। రూపేణ తేనాద్భుతదర్శనేన। అతుల్యవీర్యాణ్యతిరూపవంతి విఘ్నం సదా తపసశ్చింతయంతి॥ ౧౫

రక్షాంసి తానీతి నివార్య పుత్రం। విభాండకస్తపసే నిర్జగామ। యదా పునః కాశ్యపో నిర్జగామ ఫలాని హర్తుం విధినా వనాద్ధి॥ ౧౬

౫౧ ఓ తండ్రీ! ఆకాశమునందు మెఱుపుతీగవలె నతని కంఠమునందు జడ వ్రేలాడుచు ప్రకాశించుచుండెను. అతని కంఠమునకు క్రింది భాగమున, రోమరహితములగు రెండు మాంసపుముద్దలు మనోహరముగా నున్నవి.

౫౨ ఓ తండ్రీ! నే నిచ్చిన కందమూలఫలాదులనుగాని యర్ఘ్యపాద్యాదులనుగాని భుజింపలేదు. నాకు ఫలాదుల నిచ్చెను. మనయొద్దనున్న ఫలములు, మా సుర్యములో ఆ తపస్వి యిచ్చిన ఫలములతో సమానము కానేరవు. ఆ తపస్వి యిచ్చిన ఫలములను నేను భక్షించితిని. సుగంధములగు జలములను త్రాగితిని. ఫలములుగాని రసములుగాని బహువిధములుగా నుండెను.

౫౩ ఓ తండ్రీ! నే నా తపస్వియొక్క సమీపమునుండఁ గోరికగా నున్నది. ఆ తపస్వియొక్క వ్రతచర్య తెల్పియుండెను. (అనగా వ్రతచర్య తెలుప) ఆ బ్రహ్మచారితోఁగూడ, నేనుగూడ నట్టి వ్రతచర్య చేయవలయునని కోరుచుంటిని. ఎందువల్లననగా నాతఁడిట్టి బ్రహ్మచర్య చేయుటచేతనే గొప్ప తపస్వియయ్యెను. కాన నేనుగూడ చేసెదననియె.

౫౪ ఈప్రకారముగాఁ జెప్పబడిన తన కుమారుని వాక్యమును విభాండకమహర్షి విని, తపోబలముచేత యథార్థమును దెలిసికొని తన పుత్త్రునిగూర్చి యివ్విధముగాఁ బలికెను.

౫౫ ఓ పుత్త్రకా! నీవు చూచిన యాశ్చర్యరూపమును గురించి నే నాలోచింపగా రాక్షసుడట్టి యద్భుతరూపముతో సంచరించుచున్నట్లు తోచుచున్నది. మిక్కిలి వీరులు సౌందర్యముగల రాక్షసులు మహాత్ముల తపస్సులకు విఘ్నములను జేయుటకు కాలోచించుచుందురు అని విభాండకుడు ఋష్యశృంగునితో జెప్పెను.

౫౬ ఓ పుత్త్రకా! నీవారాక్షసుల తెరవునకుఁ బోవద్దని పుత్త్రుని నివారించి తన యాశ్రమమునుండి కందమూలఫలాదులను దీసికొని వచ్చుటకు మఱియొక వనమునకు విభాండకమహర్షి వెళ్ళెను.

తదా పున ర్లోభయితుం జగామ సా వారయోషా
ముని మృష్యశృంగం । దృష్ట్వైవ తా మృష్యశృంగః
ప్రహృష్టః సంభ్రాంతరూపో న్యపత త్తదాసీం॥ ౫౭

1 ప్రోవాచ చైనాం భవదాశ్రమాయ గచ్ఛామి యావ
న్నపితా మమైతి । తతో వేశ్యా కాశ్యపస్యైకపుత్రం
ప్రవేశ్య యోగేన విముచ్య నావం॥ ౫౮

* ప్రమోదయంతో వివిధై రూపాయై రాజగుర్మ రంగాధిప
రాజధానీం । సర్వ స్సువృష్టిశ్చ బభూవ దేశే తత్పావ
విన్యాసవశా త్సుభిక్షం॥ ౫౯

స లోమపాదః పరిపూర్ణకామ స్సుతాం దదా
ఋష్యశృంగాయ శాంతాం॥ ౫౯ ౧

---

* వ్యా॥ నను వేశ్యాలింగనాదినా తద్దత్త భక్ష్యభో
జ్యాదిభోజనాదిభిశ్చ ఋష్యశృంగస్య మహా న్త్స్తపోహానా
సత్యాం తస్య పాదప్రక్షేపణేనైవ రోమపాదరాష్ట్రే సువృష్టి
రభూదితి కథన మనుపపన్నం స్యాదితి చేదత్రోచ్యతే తస్య
స్త్రీవిషయకజ్ఞానస్యై ... భా ... త్ వారస్త్రీవిషయకజ్ఞానం
కథంవా భవేత్ అపిచ ... నశ్చాంచల్యస్య హేతురేవ నాస్తి

---

1. ఆ॥ రా॥

౫౪ విభాండకమహర్షి, వనమునకు వెళ్ళిన యవకాశమునుజూచి వేశ్య తిరిగి ఋష్యశృంగుని లోభపెట్టుటకు ఋష్యశృంగాశ్రమమునకు వెళ్ళగా దన సమీపమునకువచ్చిన వేశ్యను ఋష్యశృంగుడు చూచి సంతుష్టుడును భ్రాంతచిత్తుడునయ్యెను

౫౬-౫౯ ఋష్యశృంగుడు మునివేషధారిణి యగు తపస్వినిఁగూర్చి యివ్విధముగఁబలికెను. నాతండ్రియగు విభాండకమహర్షి రాకమునుపే నీయాశ్రమమునకు వెళ్ళెదమని బయలుదెడలి వేశ్యలందఱు నివసించిన కల్పితాశ్రమమువద్దకు ఋష్యశృంగుడు వచ్చి వారున్న నావమీదనెక్కెను. ఆవేశ్య లిట్లుఋష్యశృంగుని తనపడవయొద్దకుఁదీసికొనివచ్చి యతని సమాధితోఁగూడ నావనువిడిపించెను (అనగా జీవబ్రహ్మైక్యానుసంధానరూపమగు ఋష్యశృంగుని సమాధిని భంగపఱచెననియు, ఆశ్రమమువలె కల్పింపబడిన పడవను రోమపాదుని నగరమునకు విడిచిపెట్టించినదనియు భావము.) ఇట్లు నావనువదలి వేశ్యలందఱు వివిధోపాయములచే ఋష్యశృంగుని సంతోషపెట్టుచు రోమపాదుని రాజధానియగు చంపాపట్టణమునకు దీసికొనివచ్చిరి ఋష్యశృంగుని పాదవిన్యాసము రోమపాదనగరమున కలుగుటతోడనే సువృష్టి, సుభిక్షము కలిగెను అప్పుడు రోమపాదుడు తన యభీష్టము నెరవేరినందున ఋష్యశృంగునకు దన కొమరితయగు శాంతనిచ్చి వివాహము చేసి తనపట్టణముననే యుంచుకొనెను.

---

*వ్యా॥ వేశ్యాలింగనాదులవలనను వేశ్యలిచ్చిన భక్ష్యాదులను భుజించుటచేతను, ఋష్యశృంగమహర్షికి దపోహానికల్గి మహిమయేపోగా నతని పాదవిన్యాసమాత్రముననే రోమపాదునిరాష్ట్రమునకు భిక్షము సువృష్టియు కలిగెనని చెప్పుట యుపపన్నము కాదని పూర్వపక్షము రాగా సమాధానము చెప్పబడుచున్నది. ఋష్యశృంగునకు స్త్రీవిషయకజ్ఞానమే లేనపుడు వేశ్యాస్త్రీనియుక జ్ఞానమెట్లుండును?

మఱియును, మనశ్చాంచల్యమునకుఁ గారణమేలేదు (ప్రాయః) రాగయుక్తమగు మనస్సుతోఁగూడిన బహిరింద్రియవ్యాపారమే ఫలకారియగును. ఇవ్విషయమున, వస్త్రములు తొలగిపోయిన రాక్షస

క్రోధప్రతీకారకరంచ చక్రే గాత్రేష్వవ మార్గేషు చ కవనకాంశ్చ । స భాండకస్య వ్రజతి స్స రాజా పశూ స్వాభూతా న్నృశువాంశ్చ వీరః॥ ౬౦౫

సమాదశ త్పుత్త్రిమాగీన మహర్షి ర్విభాండకః పరిపృచ్ఛ్యే ద్యదావః । సవ క్తవ్యః ప్రాంజలిభి ర్భవద్భిః పుత్రస్య తే పశవః కవనకాశ్చ॥ ౬౦౫

రాగయుక్త మనస్సంయుక్తేంద్రియ స్యాపారపన ఫలకారీ భవేత్ అత్రాపసారితచేల రాత సీసరిశీలకః హనుమానేవ సాక్షీ, తస్మాత్తపోహానిర్నాస్తి. కించవేశ్యాదత్త భక్ష్యభోజ నాదినా కించిద్దోషసంప్రాప్తావపి తపోమాహాత్మ్యత్తద్దోషోపి దగ్ధపవేతి జ్ఞేయం.

నను ఋష్యశృంగేణ శాస్త్రాణి పఠితానివా నవా? యదిపఠితాని తదాశాస్త్రేషు స్త్రియ ఈదృశ్యఇతి, తత్సాహ చర్యం బ్రహ్మచారిణః దోషావహ మితి కథంనజ్ఞాతం. అపిచా దర్శనాత్ స్త్రీ దర్శన మపి, నకదాపితస్యాసీ ద్భవద్యా, యది న పఠితాని తేనశాస్త్రాణి, అజ్ఞస్తదాభవేత్, అజ్ఞ స్యైతత్కథమ స్యానుగ్రహ సామర్థ్యం భవేత్॥ తస్మాత్సర్వజ్ఞ ఏవాయ మితివక్తవ్యం, తథాసత్య కృత్యకరణేన తస్యతపోహాని రభూ దితి చేదుచ్యతే॥

బ్రహ్మవేత్తాతు యద్యత్పశ్యతి తత్తత్సర్వం బ్రహ్మైవ వేతిమనుతే అదనగుణతయా ప్రవర్తతేసర్వాణ్యపి కార్యాణి ఋజుబుద్ధ్యా కరోతి నతువిషయాభిలాషతః॥

౩౦-౩౧ రోమపాదుడు విభాండకమహర్షికిఁ గోపోపశాంతి జేయుటకుఁ దనపట్టణమునకు విభాండకాశ్రమమునకును మధ్యలో గోవులను ఇతరపశువులను వ్యవసాయకులను గోపాలకులను నుండనేర్పఱచి పశుపాలకులు మొదలగువారితో నిటుల జెప్పెను. ఓ వ్యవసాయకులారా! ఓ పశుపాలకులారా! విభాండకమహర్షి తన పుత్త్రుని వెదకికొనుచు వచ్చుసమయమున నతడు మీరెవరని కాని యీ పశువులు భూములు ఎవరివని కాని మిమ్ముల నడిగినచో వినయముతో మీరలు విభాండకునితో మీకుమారునివే యీ పశువులం భూములు మేము అని చెప్పవలయునని వారలకు జెప్పి పంపెను.

---

స్త్రీలను బరిశీలించి చూచిన హనుమంతుఁడె సాక్షి. ఆ కారణమున తపోహాని, ఋష్యశృంగునకు వచ్చెనని చెప్పుట సమంజసము కానేరదు. ఇదియునుం గాక, వేశ్యలచే నీయబడిన భక్ష్యములను భుజించుటచేఁ గొంచెము దోషము సంప్రాప్తమైనను దపోమహిమచే తద్దోషము దగ్ధమైనదని తెలియనగు ఇట్లు చెప్పినను కొందఱు క్రింది విధముగా శంకించెదరు (ఏమన) ఋష్యశృంగుడు శాస్త్రములను జదువలేదా, పఠించెనని యంగీకరించిన స్త్రీలు, ఇట్టివారని కాని, స్త్రీసాహచర్యము బ్రహ్మచారికి దోషావహమని కాని యెట్లు తెలియదు? ఇదియునుం గాక, యారణ్యక స్త్రీలనైనను ఋష్యశృంగుడెప్పుడైనను, చూచియుండలేదా? మఱియు, శాస్త్రములను బఠింపలేదని యంగీకరించినచో ఋష్యశృంగుడు మూర్ఖుడై యుండవలసి వచ్చును. అట్లైనచో జ్ఞానవిహీనునకు, అనుగ్రహసామర్థ్యమెట్లు కలుగును కావున ఋష్యశృంగుడు సర్వజ్ఞుడనియే చెప్పవలయును.

అభక్ష్యభక్షణాదులవలనఁ దపోహానియే కలిగెనని పూర్వపక్షవాదము నిల్చియున్నది. (ఇందుకు సమాధానమేమనగా) ఋష్యశృంగుడు బ్రహ్మవేత్తయనియందురు, అంగీకరించినవిషయమే కదా. బ్రహ్మవేత్త, యేయేవస్తువులను జూచునో యాయావస్తువునంతయు బ్రహ్మ

అథోపజాతం స ముని శ్చకోప స్వమాశ్రమం ఫలమూలం గృహీత్వా । అన్వేషమాణశ్చ న తత్ర పుత్రీం దదర్శ చుక్రోధ తతో భృశం సః॥ ౬౨౫

తతస్సకోపేన విదీర్యమాణ మాశంకమానో నృపతే ర్విధానం। జగామ చంపాం ప్రతి పీడ్యమాణ స్తమంగరాజం సపురంసరాష్ట్రం॥ ౬౩౫

సవై శ్రాంతః క్షుధితః కాశ్యప స్తాన్ ఘోషాన్ స్తేశాన్ పాదచరా న్సమృద్ధాన్ । గోపైశ్చ తై ర్విధివ త్పూజ్యమానో రాజేవ తాం రాత్రి ముపాస తత్ర॥ ౬౪౫

అవాపసత్కార మతీవ తస్మా త్ప్రోవాచకః స్య ప్రహితాస్థ గోపాః । ఊచు స్తత స్తేఽభ్యుపగమ్య సర్వే ధనం తవేదం విహితం సుతస్య॥ ౬౫౫

---

ఋజుబుద్ధేః పాపప్రసక్తే రేవ న తథాసతి తపోహానిః కథంభవేత్, అపిచబ్రహ్మవిదోపి ప్రారబ్ధముపభోగ్యేనక్షయంఖలు॥

తస్మాదేవ తత్పితా యోగదృష్ట్యా సర్వంజ్ఞాత్వా కౌమారపవాయం దోషః రాజావా, వేశ్యావా నిమిత్తమాత్రమితి మత్వైవరాజ్ఞః వేశ్యాయాంచ శాపంనదత్తవాన్ అపిచ వారస్త్రీస్పర్శః బలీయాన్వా తత్తపో బలవద్వేతి విచార్యతాం, శక్తిమానశ్శక్తం స్పృశతిచేత్ శక్తస్య శక్తిరశక్తస్యైవ కించిద్గచ్ఛేత్, తస్మాదేవ సదాచారవతాం చండా

౬౨-౬౩½ అనంతరము విభాండకమహర్షియు కందమూలఫలాదులను దీసికొని తన యాశ్రమమునకు రాగా దన పుత్త్రుఁడు కన్పడనందున మిక్కిలి కోపగించి రోమపాదునివలననే యీపని జరిగినదని తెలుసుకొని రోమపాదునిదేశమును జూచుకొనుచు చంపాపట్టణమును గూర్చి వెళ్ళుచుండెను.

౬౪-౬౫½ విభాండకమహర్షి క్షుద్బాధతో గూడినవాఁడై దేశములను, గొల్లపల్లెలను సర్వసమృద్ధితో నొప్పుచుండెడి గ్రామాదులనుజూచుచు నాయా గ్రామాదులయందలి ప్రజలచే మిక్కిలి పూజింపఁబడుచు రాత్రియందు నొక్క గొల్లపల్లెలోనుండి యా గోపాలకులచేతను బూజింపఁబడి విభాండకమహర్షి వారల నిట్లడిగెను. ఓ గోపాలకులారా! మీరలెవ్వరు? ఎవ్వరిచే బంపబడిరి యని యమ్మునీశ్వరు డడుగగా వారలిట్లు చెప్పిరి. ఓ మునీంద్రా! మేము నీకుమారుని సేవకులము. ఈ భూములు గ్రామములు ఈ గోవులు నీపుత్త్రునివే యని బదులు చెప్పుచుండిరి.

---

రూపమునుగానే, తలచును, తదనుగుణముగానే ప్రవర్తించును. సమస్తకార్యములను ఋజుబుద్ధితోనే చేయును గాని విషయాభిలాషతోఁ జేయడు. ఋజుబుద్ధితోఁ జేసినవానికి పాపప్రసక్తియే లేదు. అట్లయిన దపోహాని, యెట్లు సంభవించును?

ఇదియునుంగాక, యెట్టి బ్రహ్మవేత్తకైనను బ్రారబ్ధము అనుభవింపఁ దగినదైయున్నదికదా! అందువలననే ఋష్యశృంగనితండ్రి యోగ దృష్టిచే సర్వమును దెలిసికొని యీ దోషము తన పుత్త్రునిదేయని నిశ్చయించెను. రోమపాదుఁడుకాని, వేశ్యకాని నిమిత్తమాత్రవని తలంచియే రాజునకుగాని, వేశ్యలకుగాని శాపమిచ్చియుండలేదు.

ఇదియునుంగాక, వేశ్యాస్త్రీస్పర్శదోషము బలవత్తరమైనదా? ఋష్యశృంగునితపస్సు బలవత్తరమైనదా! అని విచారించెదము.

ఏవం స దేశేష్వభిపూజ్యమానస్తాంస్తైశ్చైవ శృణ్వన్మధుర ప్రలాపాన్। ప్రశాంతభూమ్యుష్మరజాః ప్రహృష్టః సమాససాదాంగపతిం పురస్తాత్॥ ౬౬

సపూజితస్తేన నరర్షభేణ దదర్శపుత్రీం దివి దేవయింద్రం। శాంతాం స్నుషాం చైవ దదర్శ తత్ర సౌదామినీ ముచ్చరంతీం యథైవ॥ ౬౭

గ్రామాంశ్చ ఘోషాంశ్చ సుతస్య దృష్ట్వా శాంతాం చ శాంతశ్చ వరం సకోపః। చకార తస్మై చ వరం ప్రసాదం విభాండకో భూపతయే నరేంద్ర॥ ౬౮

---

లాస్పదం నేత్రోదమేవ కారణమితిజ్ఞేయం కించ వారస్త్రీ స్పర్శనా మునిపుత్రస్య యదితపోహానిస్స్యాత్తర్హి నాతాపితత్కారగస్తస్య అఘోరణహా స్వగతపక్వచణాదభక్షిణ శ్చైవస్త్రీబ్రాహ్మణస్యచ శ్వమాంసభక్షిణో కౌశికస్యచ కావాగతిరితి నమాధేయం॥ వస్తుతస్తు. ఋష్యశృంగస్య తపస్స్థితస్యాగ్రతః పురః। పితామహాస్సమాగత్య దదౌ తస్మై వరాన్బహూన్॥ యత్రత్వం సంస్థితస్తత్ర సుభిక్షం క్షామనాశనం పశుప్రజాభివృద్ధిస్స్యాత్త్వత్సంకల్పః ఫలద వేదితి బ్రహ్మవరానుసారేణ తత్పాదవిన్యాసవశాత్సుభిక్షమితి సర్వం రమణీయం॥

౯౮ విభాండకమహర్షి యీప్రకారము రోమపాదుని దేశములో గ్రామాదులయందలి ప్రజలచేఁ బూజింపఁబడుచు నచ్చటివారల నడుగుచు మీపుత్త్రునిసేయని సంపూర్ణమైన సమాధానములను విని తన కోపము కొంతశాంతించినవాఁడై సంతోషముతో రోమపాదుని పట్టణమును జేరెను.

౯౯ రాజగు రోమపాదుఁడు పాద్యాదులచే విభాండకమహర్షినిఁ దనయంతఃపురమునకు దీసికొనిపోఁగా నమ్మహర్షి స్వర్గములో దేవేంద్రునివలె మహావైభవముతో నున్న తనపుత్త్రుని, మెఱుపుతీఁగవలె ప్రకాశించుచున్న తనకోడలినిఁ జూచెను. తన కుమారుని వైభవమును జూచి కోపము పూర్తిగా శాంతించినవాఁడై రోమపాదునియందు దను గ్రహము కలవాఁడయ్యెను.

---

శక్తిమంతుఁడు, శక్తిహీనుని స్పృశించినయెడల శక్తిమంతుని శక్తిచే యశక్తునకుఁ గొంచెముచేతఁగాని యశక్తునిదోషము శక్తిమంతునకు సంక్రమింపదు. కావుననే సదాచారవంతులు చండాలాదులను స్పృశింపకపోవుటకుఁ గారణముగూడ నిదియే యని యూహింపనగును. ఇదియునుంగాక వేశ్యాస్త్రీస్పర్శము మొదలగువానిచే ఋష్యశృంగునకుఁ దపోహాని కలిగెననినచో, వాతాపిని భక్షించిన యగస్త్యునకును, నూపటివానిచేతిలోని కనకగుగ్గిళ్ళను లాగుకొనితినిన యుషస్తి బ్రాహ్మణునకును శ్వమాంసభక్షకుఁడగు విశ్వామిత్రునకును గతి యేమిచెప్పవలెనని సమాధానముకొనవలసినది. వాస్తవికము విచారించినచో దపోనిష్ఠుఁడగు ఋష్యశృంగుని యొద్దకు నొకస్వప్నమున బ్రహ్మవచ్చి యమ్మహర్షికి వరములనేకము లనిచ్చెను. (ఏమన) ఓఋష్యశృంగుఁడా! నీ వెచ్చటనుండెదవో యచ్చట సుభిక్షము, క్షామము లేక పోవుట, పశువృద్ధి, ప్రజావృద్ధి కలుగును. మఱియు నీసంకల్పమున ఫలము కలుగునని యిట్లు బ్రహ్మ వర మిచ్చిన హేతువుచే మునిపాదన్యాసముచే సుభిక్షము కలిగెనని యెఱుఁగనగు.

1 సతత్రతనిక్షిప్య సుతం మహర్షి రువాచ సూర్యాగ్నిసమ
ప్రభావః । జాతేతు పుత్త్రేవన మావ్రజేథా రాజ్ఞః
ప్రియాణ్యస్య సర్వాణి కృత్వా॥ ౬౯

ఇత్యుక్త్వా ఋష్యశృంగం తం దంపత్యో శ్చాశిషంచరన్
అనుగృహ్యంగరాజంచ జగామస్వాశ్రమంమునిః॥ ౭౦

ఇత్యే తదృష్యశృంగస్య చరిత్రం పాపనాశనం
కథితం తే మహారాజ త మానీయా చర క్రతుం॥ ౭౧

తచ్ఛ్రుత్వా రాజశార్దూలః ప్రహృష్ట హృదయ స్తదా
సమానేతుం ఋష్యశృంగం గంతు కామో౽ భవ
త్స్వయం॥ ౭౨

ఆ శ్చ ర్య రా మా య ణే

అష్టమ స్సర్గ స్సమా ప్తః

---

1. అ॥ రా॥

౧౯½ అనంతరము మహాప్రభావముగల విభాండకమహర్షి, కుమారు-
నక్కడనే యుండునట్లు నియోగించి తాను తన యాశ్రమమునకు
వచ్చుచుఁ దన పుత్త్రునితో నిటులఁ జెప్పెను. కుమారా! నీవు
రోమపాదుని యభీష్టమును నెఱవేర్చి పుత్త్రసంతానము కలిగిన
పిమ్మట వనమునుగూర్చి రావలసినదియని చెప్పెను

౨౦½ ఈప్రకారము విభాండకమహర్షి ఋశ్యశృంగునిగూర్చి చెప్పి నూతన
దంపతుల నాశీర్వదించి రోమపాదునియందనుగ్రహము గలవాఁడై
తన యాశ్రమమునకు వెళ్లెను.

౨౧½ ఓ దశరథమహారాజా! పాపహరమైన ఋశ్యశృంగుని చరిత్రమును
నీకుఁ జెప్పితి ఋశ్యశృంగుని దీసికొనివచ్చి క్రతువును జేయుము
అని సుమంత్రుడు దశరథునితోఁ జెప్పెను.

౨౨½ దశరథుడు మహాప్రభావముగల ఋశ్యశృంగుని చరిత్రమును విని-
సంతోషించి యమ్మునినిఁ దీసికొనివచ్చుటకు రోమపాదుని పట్టణ-
మునకు బోవ నుద్యుక్తుఁడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున

ఎనిమిదవ సర్గము సమాప్తము.



## నవమసర్గప్రారంభః.

* అథ రాజా దశరథ స్సభార్య స్ససుహృజ్జనః
వసిష్ఠేనాభ్యనుజ్ఞాతః రోమపాదపురీం గతః॥ ౧

తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః
సఖిత్వా త్తస్య వై రాజ్ఞః ప్రహృష్టేనాంతరాత్మనా॥ ౨

---

* వసిష్ఠేనాభ్యనుజ్ఞాత ఇతి. అనేన ప్రాచీనఋత్విగభ్యనుజ్ఞానేనైవ అన్య ఆనేయ్యః నతు తదతిక్రమణేనేతి. సూచితం॥ తథాచబోధాయనః॥ యో హ్యస్య సంస్కృతః స్యాత్తం ప్రథమం వృణీత తేన సచివేగాన్యం లిప్సేతేతి అపిచాయమర్థోఽన్వయవ్యతిరేకాభ్యాం ఫలముఖేన స్పష్టీక్రియతే. అన్వయస్తావత్ అంగదేశాసీత ఋష్యశృంగ కారిత క్రతునా చత్వారః పుత్రాః భవిష్యంతీతి సనత్కుమారవాక్యం సుమంత్రేణ కథితం శ్రుత్వా వసిష్ఠాభ్యనుజ్ఞాంవినా ఋష్యశృంగానయన మయుక్తమితి నిశ్చిత్య అవాప్య తదనుజ్ఞాం దశరథ స్సమానీయ ఋష్యశృంగం వసిష్ఠఋష్యశృంగాభ్యాం కారితయాగేన సకల దురిత నిరసనపూర్వక మభిలషితసిద్ధిమవాపేతి వ్యతిరేక స్తావత్ ఏతద్వంశ్య స్త్రిశంకుః సశరీర స్వర్గప్రాప్తయే యజ్ఞః కారయితవ్య ఇతి ప్రార్థితేన వసిష్ఠేన గురుణా ప్రత్యాఖ్యాతో గురుపుత్రా నాసాద్య తైశ్శప్తః ప్రాప్తనీచజాతిః విశ్వామిత్రం శరణం ప్రాప్తః తేన ప్రతిజ్ఞాపూర్వకం సశరీరం స్వర్గం ప్రాపితోపి దేవైః పాతితః అ

## నవమసర్గప్రారంభము.

* ౧ అనంతరము దశరథమహారాజు వసిష్ఠునియనుజ్ఞనుబొంది తన భార్యలతోడను, బంధువులతోడను రోమపాదునిపత్తనమునకేగెను.

౨ ఆరోమపాదుడును, తనకు దశరథుడు పరమమిత్రుడును, బంధువుడును గాన సంతుష్టాంతరంగముతో నారాజునకుఁదగిన గౌరవమును జేసెను.

---

* దశరథుఁడు ఋష్యశృంగునిఁ దీసికొనివచ్చుటకు వసిష్ఠుని యనుజ్ఞను బొంది వచ్చెనని చెప్పుటచేఁ బూర్వమునందుండిన పురోహితుల యనుజ్ఞఁ బడసియే మఱియొక పురోహితుని దీసికొని రావలయు ననియు ప్రాచీన పురోహితుని నతిక్రమించి తీసికొనిరాఁగూడదని యీ ధర్మము దీనిచే సూచింపఁబడినది. "బోధాయనుఁడును నవ్విధమునసే చెప్పెను." (ఏమన,) ఏపురోహితుఁడు పూర్వము నుండి యజమానునిచేఁబూజితుఁడైయుండెనో, వానినే కర్మలందునంగీకరింప వలయును. వారి యనుమతిచే నితరుని కోరవలయునని—ఇది యటుండంగాక యీ విషయ మన్వయవ్యతిరేకములచే ఫలముఖముగా స్పష్టపరుపఁబడుచున్నది. అన్వయ మనగా, ఏదియుండిన నేదియుండు నో, యది యన్వయమనియు, ఏది లేనిచో నేదియుండదో యదివ్యతి రేకమనియును శాస్త్రమర్యాదయై యున్నది.

అంగదేశమునుండి తీసికొని రాబడిన ఋష్యశృంగునిచేఁజేయింపఁబడిన యాగముచే నలుగురు పుత్రులు గలుగుదురని సనత్కుమారుఁడు చెప్పిన వాక్యమును సుమంత్రుఁడు చెప్పఁగా దశరథుఁడు విని వసిష్ఠానుమతిలేనిదే ఋష్యశృంగునిఁ దీసికొనివచ్చుట న్యాయము కాదని తదనుమతినొంది దశరథుఁడు ఋష్యశృంగుని దీసికొని వచ్చె వసిష్ఠఋష్యశృంగులచేఁ జేయింపఁబడిన యాగముచే సకల పాపక్షయపూర్వకమైన యభీష్టసిద్ధి నొందెననునది యన్వయము.- స్వర్గప్రాప్తికొఱకు యజ్ఞమును జేయింపుమని త్రిశంకుడు తన

